శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# లక్ష్మీస్తోత్రమ్

(శ్రీవాధూల వీరరాఘవాచార్యప్రణీతమ్)



**తాత్పర్యకర్త:**

'పండిత రత్న' ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్

**ప్లవ నామ సంవత్సరం, ఆశ్వయుజ శుక్ల దశమి (విజయదశమి) - 15-10-2021**

**అవతారిక**

# శ్రీవాధూల వీరరాఘవాచార్య(అణ్ణావప్పఙ్గార్) స్వామివారి వైభవం:

**సకలమహీప్రత్నకనకాంచితసన్మకుటీ**
**నికరవిచిత్రకాంతిపరివీతనిజాంఘ్రియుగః,**
**పురవరభూమిసారసుచిరార్జితపుణ్యఫలం**
**వరగుణవీరరాఘవగురు ర్జయతాత్ సుచిరమ్.**

(ప్రభువులందరి శిరస్సులలో ఉండే బంగారు కిరీటాలలో పొదగబడిన రత్నాల కాంతులతో పరివేష్టింపబడిన శ్రీచరణాలను కలిగినవారు, గొప్ప స్థలమైన మహిసారపురమనే తిరుమழிశై క్షేత్రం చిరకాలం చేసికొన్న పుణ్యఫలంగా అవతరించినవారు, సద్గుణాలు నిండుగా కలవారు అయిన శ్రీ వాధూల వీరరాఘవాచార్య స్వామి చిరకాలం వర్ధిల్లాలి)

'**అణ్ణావప్పఙ్గార్**' అనే పేరుతో ప్రసిద్ధులైనవారు, వాధూలకుల తిలకులైన **శ్రీవీర రాఘవాచార్య స్వామి** భగవద్రామానుజుల మేనల్లుడైన ముదలియాండాన్ వంశంలో మహీసారక్షేత్రం అనబడే తిరుమழிశైలో శాలివాహన శకం 1688 వ సంవత్సరంలో (అంటే, క్రీ.శ. 1766 సంవత్సరంలో) వ్యయ నామ సంవత్సరం ఆణిమాసం కృష్ణపక్ష చతుర్దశి గురువారంనాడు ధనిష్ఠా నక్షత్రంలో జన్మించారు. వీరు యజుశ్శాఖకు చెందినవారు. ఆపస్తంబ సూత్రులు. లక్ష్మీస్తోత్రంలో చివర **"రఘువరాచార్యతనయాత్ సముతపన్నః"** అని వీరు స్వయంగా పలికినందున వీరి పితామహుల పేరు 'రఘువరాచార్యులు' అని తెలుస్తున్నది. ఆ విధంగానే, **భక్తిసారోదయం** అనే స్తోత్రం చివరలో "నరసింహదేశికభువా" అని ఉన్నందున, వీరి తండ్రిగారి పేరు 'నరసింహాచార్యులు' అని కూడా తెలుస్తున్నది. వీరికి 15 సంవత్సరాలు వచ్చే లోపలే స్వశాఖ అయిన యజుశ్శాఖను, తర్క వ్యాకరణ మీమాంసా సాంఖ్య పాతంజలాది శాస్త్రాలను అభ్యసించి, జ్యోతిష్య శాస్త్రం, సంగీతం, భరత శాస్త్రం మొదలైన అన్యశాస్త్రాలను కూడ అవలోకించి, ప్రతి దినం పాండిత్యంతో వర్ధిల్లారు. అనంతరం 20 సంవత్సరాల లోపలే సకల శాస్త్రాలలో నిపుణులై, తమకు తాతగారైన నరసింహాచార్యులువారి వద్ద

తిరుమంత్రార్థం మొదలైన గ్రంథాలను కూడా అధ్యయనం చేసి, గ్రంధ రచనలో కూడా చతురులై వెలిగారు.

'అణ్ణావప్పఙ్గారికి వేదాంత విద్యను బోధించిన ఆచార్యులు వాధూల వరదాచార్యులు, శ్రీరంగాచార్యులు ఆనేవారు. వీరు శ్రీరంగాది దివ్యదేశాలను సందర్శించి, ఆయా చోట్ల అన్యమతాలవారిని వాదంలో జయించి, భగవద్రామానుజ సిద్ధాంతాన్ని రక్షించి, ప్రచారం చేశారు. వీరు రచించిన గ్రంథాలు చాలా ఉన్నాయి. వాటిలో, లక్ష్మీ వైభవాన్ని తెలియజేసే స్తుతిరూపమైన కృతియే ఈ **లక్ష్మీస్తోత్రం**. ఇందులో యామునులు, కూరేశులు, భట్టర్, దేశికులు మొదలైన పలువురు పూర్వాచర్యులు అనుగ్రహించిన లక్ష్మీస్తోత్రాలలోని భావాలు ప్రతిబింబిస్తున్నాయి.

వీరు కేవలము 51 సం,, మాత్రము ఈలోకములో ఉన్నప్పటికీ ఎన్నో అపూర్వములైన గ్రంధములను మనకు అందించారు. వాటిలో ముఖ్యమైనవి శ్రీ పిళ్ళైలోకాచార్యులవారి శ్రీవచనభూషణమునకు మామునులు రాసిన వ్యాఖమునకు "అరుంబదమ్" (శ్లోక సంఖ్యలతో వివరణ), తిరుమழிశై ఆழ்వార్ల వైభవమును గురించి రాసిన "శ్రీ భక్తి సారోదయము". వీరి రచనలలో కొన్ని:

1.శ్రీ భక్తి సారోదయము, 2.వేదవల్లీ శతకము, 3.హేమలతాష్టకము, 4.అభీష్ట దండకము, 5.శుక సందేశము, 6.కమలా కల్యాణ నాటకము, 7.మలయజా పరిణయ నాటిక, 8.నృసింహాష్టకము, 9.అరుమ్పదమ్ (మామునుల శ్రీవచన భూషణ వ్యాఖ్యానమునకు వివరణ), 10.తిరుచన్ద విరుత్త ప్రతిపదము, 11.శ్రీరంగరాజస్తవ వ్యాఖ్యానము, 12.మహావీరచరిత వ్యాఖ్యానము, 13.ఉత్తర రామచరిత వ్యాఖ్యానము, 14.శతశ్లోకి వ్యాఖ్యానము, 15.రామానుజాష్టక వ్యాఖ్యానము, 16.నక్షత్రమాలా వ్యాఖ్యానము, 17.దేవరాజగురు విరచిత వరవరముని శతక వ్యాఖ్యానము, 18.దుష్కరశ్లోక టిప్పణి, 19.దినచర్య, 20.షణ్మత దర్శిని, 21.లక్ష్మ్యాః ఉపాయత్వ నిరాసః, 22.లక్ష్మీవిభుత్వ నిరాసః, 23.సూక్తిసాధుత్వ మాలికా, 24.తత్వసుధా, 25.తత్వసార వ్యాఖ్య–రత్నసారిణి, 26.సచ్చరిత్ర పరిత్రాణము, 27.పழనడై విళక్కమ్, 28.త్రింశత్ ప్రశ్నోత్తరమ్, 29.లక్ష్మీ మంగళదీపిక, 30.రామానుజాతిమానుష వైభవ స్తోత్రము, 31.అనుప్రవేశ శ్రుతి వివరణమ్, 32.శైలోగ్నిశ్చ"శ్లోక వ్యాఖ్య, 33.మహీసారవిషయ చూర్ణిక, 34.స్వాన్తే మే మదనస్తితిమ్

పరిహారా ఇత్యాది శ్లోక వ్యాఖ్య, 35.సచ్చర్యాష్టకమ్, 36.ప్రాప్యప్రపంచన పంచవింశతిః, 37.న్యాయ మన్త్రమ్, 38.తాత్పర్య సచ్ఛీకరమ్, 39.వచస్సుధా మీమాంసా, 40.వచస్సుధా పూర్వపక్షోత్తరమ్, 41.బ్రహ్మత్వభంగమ్, 42.లక్ష్మీ స్తోత్రము, 43.వరణపంచవింశతిః

వీరు 51 సంవత్సరాలు ఈ విభూతిలో వేంచేసి ఉండి ఈశ్వర వర్షం అల్పిశి మాసం శుక్లపక్ష చతుర్దశి తిథిలో ఆచార్య పాదసన్నిధిని చేరారు.

## తిరుమళిశై అణ్ణావప్పన్గార్ తనియన్:

**శ్రీమద్ వధూల నరసింహగురోస్తనూజమ్ శ్రీమత్తదీయపదపంకజ భృంగరాజమ్,**

**శ్రీరంగరాజ వరదార్య కృపాత్త భాష్యమ్ సేవే సదా రఘువరార్య ముదారచర్యమ్.**

(శ్రీవాధూల నరసింహాచార్యులవారి కుమారులు, వారి పాదపద్మాలలో గొప్ప తుమ్మెదవంటివారు (వారిని ఆశ్రయించినవారు), శ్రీరంగరాజాచార్యులవారివల్ల, శ్రీవరదాచార్యులవారివల్ల శ్రీభాష్యంలోని అర్థాలను తెలిసినవారు, గొప్ప వ్యక్తిత్వాన్ని కలవారైన వాధూల శ్రీవీరరాఘవాచార్య స్వామివారిని సేవిస్తున్నాను)



**లక్ష్మీస్తోత్రం** అనే ఈ చిరుగ్రంథం, ప్లవనామ సంవత్సరం విజయదశమి శుభసందర్భంగా భాగవతగోష్ఠికి సవినయంగా సమర్పింపబడుతున్నది.

**పద్మాజానేః కృపయా వేంకటగిరిశిఖరవాసరసికస్య,**

**విజయదశమీ ప్రదద్యాత్ శ్రేయం జగతః సమస్తభద్రాణి.**

భవదీయుడు,

**ఈయుణ్ణి అమ్మగ శింగరాచార్యులు**

నరసాపురం, 15–అక్టోబర్–2021



**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమద్వరవరమునయే నమః**

# లక్ష్మీస్తోత్రమ్

**శ్రియా యుక్తః శ్రీమాన్ స్థితిజనిలయాదీన్ కలయతే**
**జగత్యా నైవం చేత్ స్వమపి న చ పుష్ణాత్యశరణః,**
**అత స్త్వాం తత్తాదృగ్దురధిగమనిస్సీమవిభవాం**
**భజామో రుద్రాణీపరిచితపదాంభోజయుగళమ్. (1)**

లక్ష్మీ దేవితో కూడి ఉండే భగవంతుడు ఈ లోకం యొక్క స్థితి, సృష్టి, సంహారాదులను నిర్వహిస్తున్నాడు. ఈ విధంగా భగవంతుడు లక్ష్మీపతియై వీటిని చేయకపోతే అతడు తనను



**అలర్మేల్మఙ్గై - తిరుచానూరు**

కూడా పోషించుకోవడం లేదు. తల్లీ! అందువల్ల తెలియడానికి సాధ్యం కాని అంతులేని గొప్పతనాన్ని కలిగినదానవు, పార్వతీదేవిచే కీర్తింపబడిన తామరవంటి శ్రీ చరణాలను కలిగినదానవు అయిన నిన్ను సేవిస్తున్నాను.

**అయి! శ్రీ స్త్వం పూర్వం జనకతనయాభూయ జగతాం**
**ప్రభో రామస్యాభూః ప్రియసహచరీ కోసలపతేః,**
**తదాఽపుష్యః కృష్ణం నతజనని! రుక్మీంద్రతనయా**
**వినా త్వాం గోవిందః ప్రభవతి జగత్యాం క్వచన వా. (2)**

నిన్ను ఆశ్రయించినవారి విషయంలో తల్లివలె చాలా కరుణను కలిగిన ఓ శ్రీదేవీ! నీవు పూర్వం జనకమహారాజ పుత్రికవై, ఈ లోకాలకు అన్నిటికీ ప్రభువు, కోసల దేశానికి అధిపతి



**శ్రీ పరిమళ రఙ్గనాయకీ తాయార్ - తిరువిందలూర్**

అయిన శ్రీరామునకు ప్రియమైన సహచరివి అయినావు. ఆ విధంగానే, రుక్మిణివై, కృష్ణుడుగా అవతరించిన భగవంతుని సంతోషపెట్టావు. నీవు లేకపోతే నీ భర్త అయిన గోవిందుడు ఈ లోకాలకు ప్రభువు కాగలడా?

**త్వయా దృష్టః శంభుః త్రిపురమథనాయాల మరుణ**

**క్షపానాథా వాజ్ఞాం శిరసి నిదధానా వుదయతః,**

**పిబన్ భక్త్యా పద్మే! తవ చరణనిర్ణేజనజలం**

**ఫణీనా మీశానః పరివహతి మూర్ధ్నా వసుమతీమ్. (3)**

ఎర్ర తామర పువ్వులో నివాసం చేసే లక్ష్మీదేవీ! నీచే కటాక్షింపబడి నందువల్లనే శివుడు త్రిపురాలను సంహరించగలిగాడు. సూర్యచంద్రులు నీ ఆజ్ఞను శిరసా వహించి



**శ్రీ శెజ్గమల తాయార్ - తిరుత్తజ్గాళ్**

ఉదయిస్తున్నారు. సర్పాలకు ప్రభువైన ఆదిశేషుడు మీ పాదాలను అభిషేకించిన తీర్థాన్ని తాగిన తర్వాతనే తన శిరస్సుతో ఈ లోకాలను మోయగలుగుతున్నాడు.

త్వదీయే నమ్రార్తిక్షపణనిపుణే పాదకమలే
　　వహన్ మూర్ధ్నా జంభద్విషదవతి గీర్వాణనగరీమ్,
త్వదీయభ్రూభంగా జ్జనయతి జగత్ పంకజజనిః
　　త్వయా దృష్టః కో వా జనని!పద ముచ్చైః ర్న లభతే. (4)

తల్లీ! ఆశ్రయించినవారి దుఃఖాలను పోగొట్టగలిగిన మీ శ్రీచరణ పద్మాలను తలతో ధరించే ఇంద్రుడు దేవతలకు రాజధాని అయిన అమరావతిని రక్షిస్తున్నాడు. ఆ విధంగానే,



శ్రీ పేరిందేవి తాయార్ - కంచి

భగవంతుని నాభీపద్మంలో పుట్టిన బ్రహ్మ కూడా నీ కనుబొమల కదలికలను అనుసరించి ఈ లోకాన్ని రక్షిస్తున్నాడు. నీచే కటాక్షింపబడిన ఎవడు గొప్ప పదవిని పొందడు?

హరే ర్వక్షఃపీఠీ మనుకల ముపాస్థాయ విపులాం
సుధాసారైః శ్రీమచ్చరణనలినాంతర్విగలితైః,
ప్రసించంత్యంచంతీ కుముదవన మంభోజనిలయే!
కథం వా నాథత్సే మయి పదయుగం నమ్రజనని!. (5)

తల్లీ! తామరపూవులో జన్మించినదానా! భగవంతుని విశాలమైన వక్షఃస్థలం అనే పీఠాన్ని నిత్యం నీ నివాసస్థానంగా పొంది, తరువాత నీ అందమైన పాదపద్మంనుండి ప్రవహించే



శ్రీ యదుగిరి నాచ్చియార్ - మేల్కోట

అమృతవర్షంతో దారిని అంతటి తడుపుతూ కలువల వనానికి వెళ్లేటప్పుడు నీ పాదాల జంటను దాసుని తలపై కూడా ఎందుకు పెట్టలేదు?

**పురా తే పాదాబ్జప్రసృమరపరాగాన్ స్వమకుటే**

**వహన్ రుద్రోఽప్యద్రే ర్దుహితర ముదారా ముదవహత్,**

**శరణ్యే! లోకానాం మునిజనవరేణ్యే! తనుభృతామ్**

**అపాంగ స్తే భూయా దతులకుశలాయాబ్జనిలయే!. (6)**

పూర్వం నీ శ్రీచరణపద్మనుండి జాలువారిన మకరంద బిందువులను తన మకుటంలో ధరించిన రుద్రుడు అందమైన పార్వతిని వివాహం చేసుకొన్నాడు. ఈ లోకాలకు అన్నిటికీ



**శ్రీ యతిరాజనాథవల్లీ తాయార్ - శ్రీపెరుంబూదూర్**

రక్షకురాలవైన తల్లీ! తామర పువ్వును వాసంగా కలిగినదానా! మీ కటాక్ష వీక్షణం జీవసమూహానికి సాటిలేని మంచిని కలిగించాలి.

---

**పురారే స్త్వాం పుష్పైః సహ గిరిజయాऽऽరాధితవతో**

**గలం గత్వా ఘోరం గరమభవదిందూపలమివ,**

**అతః శ్రీః! శ్రుత్యంతాః ప్రణిజగు రుదారాం స్తవ గుణాన్**

**ఇయత్తానిర్ముక్తా ననవధికవాత్సల్యజలధే!.** (7)

శ్రీదేవి! వాత్సల్య గుణానికి సాటి లేని సముద్రంవంటిదానా! నిన్ను పార్వతీదేవితో కలసి పూలతో ఆరాధించిన శివుని కంఠాన్ని చేరిన ఘోరమైన విషంకూడా చంద్రకాంతమణివలె



**శ్రీ పుష్పవల్లీ తాయార్ - తిరుక్కోవిలూర్**

చల్లని స్వభావాన్ని కలిగినది అయినది. అందువల్లనే వేదాంతాలు నిన్ను "ఉదారా" (ఔదార్యాన్ని కలిగినదానవు) అని నీ గుణాలను అంతులేనివి అని కీర్తించాయి.

**శరజ్జ్యోత్స్నాకాంతి స్తుహినకరబింబాభవదనా**
**కుచాభ్యా మానమ్రా కువలయదళస్పర్ధినయనా,**
**దధానా హస్తాభ్యాం నలినయుగళం క్వాపి మహసాం**
**తతిర్విష్ణో ర్వక్షఃస్థల మధివసంతీ విజయతే. (8)**

శరత్కాలంలో వెన్నెలతో సమానమైన కాంతిని కలిగినది, చంద్రబింబంవంటి ముఖాన్ని కలిగినది, కుచభారంతో కొంచెం వంగినది, కలువలతో పోటీపడే నేత్రాలను కలిగినది, చేతిలో



**శ్రీ సుందరాల్లీ తాయార్ - తిరుమాలిరుఞ్జోలై**

తామర పువ్వులను ధరించినది, భగవంతుని వక్షస్సులో నివసించేది అయిన లక్ష్మీదేవి వర్ణించడానికి సాధ్యంకాని కాంతిసమూహంవలె వర్ధిల్లుతున్నది.

**సచంద్రే సోష్ణాంశౌ విరమతి విరించే సహ శివే**

**కృతాంతే జాతాం తే భజతి చ విరామం సురపతౌ,**

**అనూపే సర్వస్మిన్ వటదళతలే త్వత్పతిరసౌ**

**ముకుందః సానందం విహరతి రమే! కల్పవిరమే. (9)**

లక్ష్మీదేవీ! అంతటా నీరు విస్తరించిన సమయమైన ప్రళయకాలం చివరిలో చంద్రుడు, సూర్యుడు, యముడు, ఇంద్రుడు, శివుడు, బ్రహ్మ అనే అందరూ లయించిన



**శ్రీ చెంచులక్ష్మీ తాయార్ - అహోబిలం**

తరువాత కూడా ఈ నాథుడైన ముకుందుడు మర్రిఆకుపై ఆనందంగా విహరిస్తున్నాడు.

**పయఃపారావారే మణివిరచితే మంటపతతే**

**ప్రతీహారే వాణీధరణిధరకన్యాపరివృతే,**

**మణీపీఠే తస్మిన్ కనకమయపద్మే స్థితిజుషో**

**హరే రంకస్థాం త్వాం కతిచన భజంతే కృతధియః. (10)**

క్షీరసముద్ర తీరంలో మణులతో నిర్మింపబడిన మంటపంలో సరస్వతి, పార్వతి రెండు వైపులా ఉండగా, మణులతో చేయబడిన పీఠంలో బంగారు మయమైన తామరపువ్వులలో



**శ్రీ అలర్మేల్మంగై తాయార్ - తిరుచానూర్**

వేంచేసి ఉండే భగవంతుని ఒడిని అధిష్ఠించిన నిన్ను కొంతమంది జ్ఞానులు మాత్రమే సేవిస్తున్నారు.

**పరవ్యోమ్నః పత్యుః ప్రియమహిషి! తే పాదయుగళీ**
**నిదిధ్యాసా యస్మిన్నుదయ మయతే లోకజనని!,**
**తదేవాస్మై దేవి! ప్రదిశసి సురేంద్రాభిలషితం**
**పదం వాణీం చాపి ప్రచురకరుణాసారభరితామ్. (11)**

పరమపదనాథుని ప్రియమహిషీ! నీ పాదాలు రెండింటిలో నిరంతరం ధ్యానం ఎవనికి కలుగుతుందో, అప్పుడే అతనికి నీవు దేవతల ప్రభువుకూడా కోరే పదవిని, కరుణ నిండిన వాక్కును అనుగ్రహిస్తున్నావు.



**శ్రీ శిరీవరమఙ్గై - వానమామలై**

**వదంతి త్వాం సంతో హుతభుజ మధిష్ఠాయ సకలం**

**సమశ్నంతీ హోత్రా హుత మనుపదం శ్రీర్భగవతి!,**

**పురాణా వాణ్యేవం ప్రణిగదతి బింబే దినపతేః**

**సమం పత్న్యాఽనర్ఘ్యాణ్యనుదిన మిహార్ఘ్యాణి భజతే. (12)**

గుణషట్కాన్ని పరిపూర్ణంగా కలిగిన లక్ష్మీదేవీ! ఒక్కొక్క యాగంలోనూ ఋత్విక్కులచే యాగాగ్నిలో హోమం చేయబడే హవిస్సును ఆ అగ్నిని అధిష్ఠించి నీవు భుజిస్తున్నావు - అని విజ్ఞులు పలుకుతున్నారు. ఈ విధంగానే, అనాది అయిన వేదాలు నాలుగు ప్రతిదినం



**శ్రీ పద్మాసని తాయార్ - తిరుప్పుల్లాణి**

ద్విజులచే సూర్యుని ఉద్దేశించి సమర్పింపబడే వెలలేని అర్ఘ్యాన్ని నీవే నీ భర్త అయిన భగవంతునితో కలసి సూర్యబింబంలో ఉంటూ స్వీకరిస్తున్నావు అని తెలుపుతున్నది.

**త్వమాత్మా త్వం కాలః త్వమసి చ పరంజ్యోతిరుదధిః**

**త్వమక్ష్ణో రానందః త్వమసి చ పరబ్రహ్మమహిషీ,**

**చిదాత్మా త్వం లక్ష్మీః జగదిహ తవాపాంగచలనం**

**సమాలంబ్య శ్రీమాన్ సృజతి భగవానప్యవతి చ. (13)**

లక్ష్మీదేవీ! నీవు భగవంతునకు శరీరమై ఉన్నావు. పరబ్రహ్మమహిషివై ఉన్నందున నీవు కాలమై ఉన్నావు. నీవు పరంజ్యోతివి. నీవు సముద్రమై ఉన్నావు. జ్ఞానం కలిగిన జీవునిగా



**శ్రీ సుధావల్లీ తాయార్ - తిరుక్కడిగై (షోలింగర్)**

కూడా అవుతున్నావు. ఇంకా నీవు కన్నులకు ఆనందమై ఉన్నావు. నీ కటాక్షాల ప్రసారం అనుసరించే భగవంతుడు ఈ లోకాలను సృష్టిస్తున్నాడు, రక్షిస్తున్నాడు, లయం చేస్తున్నాడు.

గుణైః పూర్ణే ! నిర్ణేజనజలపవిత్రత్రిభువనే!
జరాదూరీభూతే! జనని! నిగమాంత స్తవ పదే,
నతానాం స్తోతౄణా మమితఫలవిశ్రాణనచణౌ
వయం వైకుంఠేశప్రణయిని! భజామ స్తవ పదౌ. (14)

కళ్యాణగుణాలను నిండుగా కలిగినదానా! చరణాలను అభిషేకించిన తీర్థంతో ముల్లోకాలను పవిత్రం చేసేదానా! వార్ధక్యం లేనిదానా! తల్లీ! ఉపనిషత్తులచే కీర్తింపబడేదానా!



శ్రీ సారనాయకీ తాయార్ - తిరుచ్చేరై

వైకుంఠనాథునకు ప్రియమైనదానా! స్తుతించే భక్తులకు అంతు లేని ఫలాలను ఇవ్వగలిగిన నీ చరణాల రెండిటిని మేము సేవిస్తున్నాము.

**క్షమాఽఽచారౌ దూరే గురుచరణభక్తిస్తు నితరాం**
**తథాఽధర్మేఽప్యాస్థా తవ చరణచింతా మయి కృతః,**
**తథాఽప్యంగాపాంగానయి కలయ లక్ష్మీ స్తవ దయాం**
**ప్రశంసంత్యుద్దామాం యమనియమవంతో మునిజనాః. (15)**

నా దగ్గర మన్నించే స్వభావం, మంచి ప్రవర్తన లేదు. ఆచార్యుల చరణాలలో భక్తి అనేది పూర్తిగా లేదు. ధర్మంలో ఆసక్తి లేకపోవడంతో పాటు, అధర్మంలో చాలా ఆసక్తి ఉన్నది. ఈ విధంగా ఉండగా, నీ శ్రీ చరణాలనుగూర్చిన చింత ఏవిధంగా నాకు కలుగుతుంది? ఈ



**శ్రీ కనకవల్లీ తాయార్ - తిరువెవ్వుళ్**

విధంగా నేను ఉన్నప్పటికీ నన్ను నీవు రక్షించాలిసుమా! ఎందుకంటే, యమనియమాలను కలిగిన మునులు నీ కరుణను అడ్డు లేనిదని పొగడుతున్నారు కదా.

**తవాపాంగైః దృష్టో జనని! కరుణార్ద్రైః భవతి యః**
**న వేత్తా శాస్త్రాణాం స ఖలు కులశీలాదిసహితః,**
**సదర్పం కాందర్పం శమయతి చ దాంతేన మనసా**
**ప్రశాంత్యేనామీశ శ్చతురుదధివేలాం వసుమతీమ్. (16)**

తల్లీ! కరుణ నిండిన నీ చల్లని కటాక్షాల ప్రసారానికి ఎవడు లక్ష్యం అవుతున్నాడో అతడు అన్ని శాస్త్రాలను తెలిసినవాడుగా, మంచి వంశంలో జన్మించినవాడుగా, మంచి



**శ్రీ తిరుమామగళ్ నాచ్చియార్ - తిరుక్కోట్టియూర్**

ప్రవర్తన మొదలైనవానితో కూడినవాడుగా అవుతున్నాడు. అతడు, తన నియమింపబడిన మనసుతో మన్మథుని గర్వాన్ని అణచి వేస్తున్నాడు. నాలుగు సముద్రాలను అవధిగా కలిగిన ఈ భూమిని అంతటిని పాలిస్తున్నాడు.

అదోషః కోఽవాఽఽస్తే జన ఇతి రుషం శేషశయితుః

పరిష్వంగై స్తుంగైః ప్రశమయసి కారుణ్యభరితే!,

మదీయానార్ద్రానప్యధిక మపరాధాన్ భగవతి!

క్షమస్వేమాం లక్ష్మి! స్తుతిమపి మమాంగీకురు ముదా. (17)

కరుణ నిండినదానా! ఆదిశేషునిపై పరుండి ఉండే భగవంతుని కోపాన్ని నీవు "దోషం చేయనివాడు ఎవడున్నాడు?" అని పలికి, నీ ప్రియవచనాలతో ఉపశమింపజేస్తున్నావు.



**శ్రీ కోమలవల్లీ తాయార్ - తిరుక్కుడంద్లై**

అందుచేత దాసుని అపరాధాలనుకూడా నీవు సహించాలి. ఇంతేకాక, దాసుని ఈ స్తుతిని స్వీకరించాలి.

**కదాఽరణ్యే పుణ్యే కమలవనవాపీపరివృతే**
**తరూణాం ఛాయాభిః తరణికిరణాంకర్ధిని తలే,**
**వసన్ మాతర్లక్ష్మీః కమలవనవాసైకరసికే!**
**ప్రసీదేతి క్రోశన్ కలుష మపనేష్యే పరిణతమ్. (18)**

తామరపూవులో నివసించడంలో కోరిక కలిగినదానా! తామరపూలు నిండిన జలప్రదేశాలచే చుట్టబడి ఉన్నది. వృక్షాల నీడతో ఆవరింపబడిన సూర్య కిరణాలు కలిగినది



**శ్రీ హేమాంబుజవల్లీ తాయర్ - తిరుప్పుల్లమ్బూదఙ్గుడి**

అయిన పుణ్యమైన అరణ్య ప్రదేశంలో నివసిస్తూ, "నన్ను రక్షించాలి" అని నిన్ను గొంతెత్తి అర్థిస్తూ, ఎల్లప్పుడు నేను నా పాపఫలమైన పరిణతి చెందిన దోషాలను పోగొట్టుకుంటాను.

**ఇతి శ్రీభూసారం పురమధివసన్ రాఘవకవిః**

**కులే వాధూలాఖ్యే మహతి జనిమాన్ లోకవినుతే,**

**సతాం సేవీ సత్త్వాధికరఘువరాచార్యతనయాత్**

**సముత్పన్నో లక్ష్మ్యాః స్తుతిభి రధునానర్చ చరణౌ.(19)**

ఈ విధంగా భూసారక్షేత్రమనే తిరుమ్మళిశైలో, లోకంలోని అందరు నమస్కరించే గొప్ప వాధూలకులంలో జన్మించిన రఘువరాచార్యుల వారి కుమారుడైన



**నాచ్చియార్ - శ్రీరంగం**

నరసింహాచార్యులవారికి జన్మించినవారు, సత్పురుషులను సేవించేవారైన రాఘవకవి, ఈ స్తుతితో లక్ష్మీదేవి శ్రీచరణాలను అర్చించారు.

## లక్ష్మీస్తోత్రం సంపూర్ణం

ఖఖఖఖఖఖఖఖఖఖఖఖ